వేంకటరావు, బాలాంత్రపు

జాతీయగీతము

నిడదవోలు, 1916

Record no. 190

Vēṅkaṭarāvu, Bālāntrapu.

Jātīyagītamu

Niḍadavōlu, 1916

Record no. 190

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వేంకటరావు, బాలాంత్రపు.

జాతీయగీతము / బాలాంత్రపు వేంకటరావుగారిచే రచియింపఁబడినది.- 2. కూర్పు.- నిడదవోలు : ఆంధ్రప్రచారణీముద్రాక్షరశాల, 1916.

14 p. ;17 cm.

Record no. 190

Vēṅkaṭarāvu, Bālāntrapu.

Jātīyagītamu / Bālāntrapu Vēṅkaṭarāvugāricē raciyimpam̐baḍinadi.- 2. kūrpu.- Niḍadavōlu : Āṃdhrapracāraṇīmudrākṣaraśāla, 1916.

14 p. ;17 cm.

Record no. 190

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB

Date filming began:

...బంధగ్రంథమాల. ౩౪.

# జాతీయగీతము

ఇది

బాలాంత్రపు వేంకటరావుగారిచే

రచియింపఁబడినది.

అయ్యగారి నారాయణమూర్తి బి. ఏ. బి యల్ గారిచే

సంపాదింపఁబడినది.

రెండవకూర్పు.

నిడదవోలు

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1918.

వెల రు 0—1—0.

శ్రీరామచంద్ర.

# జాతీయగీతము.

రత్నాకరావగాహనము.

౧

శంకరతూణీర! సరసవిహార!
వరతరంగసనాథ! వాహినీనాథ!
ఘనజీవనాధార! గంభీరసార!
శరరూపఘనతేజ! సాగరరాజ!
పుణ్యులమాపూర్వ పురుషులఁగూర్చి
మహితవిక్రములగు మావారిఁగూర్చి
పేరుగన్నట్టి మా పెద్దలఁగూర్చి
ఆర్యులగు పురాతనాంధ్రులఁగూర్చి
వారలకీర్తి వైభవలక్ష్మిఁగూర్చి
వారల పుణ్యప్రవర్తనఁ గూర్చి
వారలధర్మతత్పరతనుగూర్చి
వారలవిజ్ఞానవల్లరిఁగూర్చి
ఆదికాలమునుండి యాఁగకయుండ
ఎంతోకాలమునుండి యెడతెగకుండఁ
గర్ణపేయంబుగా గానంబు సేయు

చున్నాఁడవని వినుచున్నాముగాన
మాపూర్వసంచిత మాణిక్యరాశి
నుదరంబులో దాఁచియుంచితిగాన
నీలోనఁ గ్రుంకివినిర్మలవృత్తి
మారత్నములఁబొందు మమతఁ జేసిము
వచ్చితిమీవేళ వైభవం బెసఁగ
మాకోర్కులనుదీర్పుమా! దయయుంచి
రమణీయగుణసాంద్ర! రత్నాకరేంద్ర!

౨

పతితపావన! యోకృపావార్ధి! నీవు
పతితులమగుమమ్ముఁ బాలింతువనియుఁ
బాపపంకిలమును బాపుదువనియు
నజ్ఞానతిమిరంబు నడఁగింతువనియు
సుజ్ఞానతేజంబు జూపుదువనియు
మాతాతతండ్రులు మాపెద్దలెల్ల
నినునమ్మియానాఁడు నీకిచ్చిచన్న
మారత్ననిచయంబు మాకిత్తువనియు
స్నానమాడఁగ వచ్చినారముగాని
న్యాయమాడఁగ వచ్చినారముగాని
ఆకుంభసంభవు నటులొక్కమాటె
దప్పిమైనినుఁబట్టి త్రాగరాలేదు



బృందారకాసురబృందంబువోలె
తెంపుమైనిన్ను మథింపరాలేదు
రఘురామచంద్రునిరాజసవృత్తిఁ
గ్రూరాస్త్రములనినుఁ గొట్టరాలేదు
సగరపుత్రులవలె సనిచెడి మేము
తటినీశ! నీయిల్లు త్రవ్వగాలేదు,
అటుగాన మాయెడ నాదరముంచి
ప్రస్తరసదృశతరంగహస్తముల
నలయింపఁగాఁబోకుమయ్య! మమ్ములను
రమణీయగుణసాంద్ర! రత్నాకరేంద్ర!

3

ఆమహావిష్ణున కత్యాదరమున
నిందిరారత్నంబు నిచ్చితివనియు,
ఆయమరేంద్రున కత్యాదరమున
నిభరాజరత్నంబు నిచ్చితివనియు
ఆపార్వతీపతి కత్యాదరమున
నిందుమహారత్న మిచ్చితివనియుఁ
గౌస్తుభమణియును గామధేనువను
గల్పవృక్షంబును గడుఁబ్రీతితోడ
దానమిచ్చిన మహోదారుండవనియు

సత్యావరంబున సమ్మృతభాండంబు
సర్థులకిడిన మహోదాత్తవనితయు
నాత్మనెఱింగిని నర్థింతుమిప్పుడు
ఆదరవృత్తిని న్నడిగెదమిప్పుడు
మారత్ననిచయంబు మాకిమ్మటంచు
రమణీయగుణసాంద్ర! రత్నాకరేంద్ర!

---

## జాతీయగీతము.

ఏమహాపూరుషుండుద • యించుకతన
నేమహారాజమూర్ధన్యుఁ • డేలుకతన
నాంధ్రదేశంబునాఁగ నీ • యవనివెలసె
నామహాభాగు*నాంధ్రునా • యాత్మఁదలఁతు.

౧

ధన్యుఁడవు! ధన్యుఁడవు! నీవు • ధన్యతముఁడ
వనఘ! చిరకాలనిశ్శబ్ద • మైనయట్టి

---

* "యయాతివంశంబున * * * బలిపుట్టె. ఆబలివలన నంగవంగకళింగసింహళపుండ్రాంధ్రులను పేళ్లుగలవారాఱ్వురు కుమారులుపుట్టిరి. వారు తూర్పుదేశంబులకు రాజులై తక్కిన దేశంబులకుఁ దమతమనామధేయంబు లిడియేలిరి" శ్రీమదాంధ్రభాగవతము — నవమస్కంధము. పేజి706. వచనము:678.



అమలమైనట్టి నీగృహ • మందు నేఁడు
శ్రీతిమధురావహంబైన సు • శ్లోకమొకటి
నూతనంబైన జాతీయ • గీతమొకటి
రాజితంబై సకలకంఠ • రవముతోడ
నవిరతంబతిస్వనంబుతో • నైక్యమంది
వేణునాదంబుతో సమ • వృత్తిఁబూని
వినఁబడుచునుండె వీనుల • విందుగాఁగ,
ఆలకించుచునుంటివా! • ఆంధ్రపుత్ర!——
మృదులపదములసర్థంబు • మేళవించి
అర్థములలో నభావంబు • నైక్యపఱచి
భావగతిని స్వరంబులఁ • బాదుకొలిపి
సుస్వరంబుల రాగంబు • పూటపఱచి
ఏసరోజాక్షి! యీమధు • మాపమందు
ఏసురాంగన! యీపుణ్య • వాసరముల
ఏమహాభారతీదేవి • యీక్షణమున
విమలగానామృతరసంబు • వెల్లిగొలిపి
యీమహాంధ్రమహోద్యాన • మెల్లయెడలఁ
బల్లవింపంగ వికసింపఁ • బరిమళింపఁ
జేయుచున్నదియో నీవు • చెప్పఁగలవ?
ఆలకించుచునుంటివా! • ఆంధ్రపుత్ర!

౨

నలుదిశలు చీఁకటులు గ్రమ్ము • నాఁడు లేగ
దినమణిని గప్పినట్టి దు • ర్దినము లేగ
గారుమబ్బులు గ్రమ్మెడు • కాలమేగ
జడలుపిడుగులు గురిసెడి • సమయమేగ
నేళ్లఁ బూళ్లను నేకమౌ • నేఁడు లేగ
తటిద్రాళహాసంబుల • తరుణమేగ
కాలమేఘంబు గర్జించు • వేళ లేగ
నవనిపంకిలమైయుండు • నదను లేగ—
అదెప్రభాతకాంతులుదోఁచె • నరయుమిపుడు
సూర్యుఁడుదయించెఁ దూర్పునఁ • జూడుమిపుడు
ఆకమునిర్మలంబయ్యె • నరయుమిపుడు
కడలనెమ్మది వ్యాపించెఁ • గాంచుమిపుడు
తోరమగుసింధుకూలంబు • దోఁచెనిపుడు,
నిశ్చలత్వంబె యెల్లెడ • నెగడెనిపుడు
అంతటను శాంతి రాజ్యమే • యయ్యెనిపుడు
అవనిసతిసస్యశాలిని • యయ్యెనిపుడు
అట్టియీవేళ నీయింట • నాంధ్రపుత్రి!
పాడిపంటలుగలవని • ప్రతిదినంబు
వచ్చుచున్నారలతిథుల • వ్వారిగాఁగ



నీవు సోమరితనముచ • లేవలేక
నీస్వధర్మంబులన్నియు • నీఁగలిపి
ఆర్యధర్మంబులన్నియు • నవలఁద్రోసి
పాణిధర్మంబులన్నియుఁ • బాఱఁద్రోలి
స్వజనులను బోషణముసేయఁ • జాలననుచు
అతిథిపూజలొనర్ప లే • నైతిననుచు
ఉదరపోషణమునకైన • నోపననుచు
చేలుపడికన్నుమోడ్చఁగాఁ • బోలునమ్మ!
దీనజనములకును గామ • ధేనువైన
ఆర్థిబృందంబునకును గ • ల్పాగమైన
పూర్వసంచిత విత్తప్రి • పూర్ణమైన
పూర్వసౌభాగ్య గౌరవా • పూర్ణమైన
యిట్టినీగృహమందు నీ • కేమికొదవ?
యిట్టినీయూరి[illegible]ందు నీ • కేమికొదవ?
యిట్టినీభూమియందు నీ • కేమికొదవ?
యిట్టినీదేశమందు నీ • కేమికొదవ?
ఆలకించుచునుంటివా! • ఆంధ్రపుత్రి!—

౩

ఏశరత్తున నొకజాతి • యేపుగనెనొ
ఆశరత్తెగనేఁడుమ • హాద్భుతముగ;

ఏమహోన్నతమున నీగ • మెల్లనడఁకె
నామహోన్నతమెగ నేఁ • డద్భుతముగ;
ఏశిరమందుఁ గారాకు • లెల్లఁ బడెనో
ఆశిరమెగ నేఁడు మ • హాద్భుతముగ;
ఎట్టివేళ నీకే నిద్ర • పట్టినదియొ
అట్టివేళయెఁ బోయె నేఁ • డద్భుతముగ
ఆలకించుచునుంటివా ! • ఆంధ్రపుత్ర ! —
ఉదయమందుచుఁ గ్రుంకుచు • నున్నయట్టి
లలితమూర్తుల సూర్యచం • ద్రులనుగనక
అందరాని నీలాకాశ • మందుఁ జేరి
నవ్వుచుండెడి తారాగ • ణంబుఁ గనక
అమలతరమైన మృదులతా • గ్రమునఁ జేరి
పరిమళించుచునున్న పు • ష్పములఁ గనక
క్షితితలంబు పవిత్రంబుఁ • జేసికొనుచు
నెపుడు ప్రవహించుచున్న వా • హినులఁ గనక
అద్భుతంబుగ రెక్కల • ల్లార్చుకొనుచుఁ
జనలదిరిగెడు పిట్టల • జాతిఁ గనక
ఆత్మజీవనోపాయంబు • నరసికొనుచు
తనును దిరిగెడు జంతుజా • లములఁ గనక
సకలమును మోహమునముంచ • జాలినట్టి



పరమసుందరి ప్రకృతి దే • వతనుగనక
ఎన్ని సంవత్సరములు నీ • వింతదనుక
గాఢనిద్రాసమావస్థఁ • గడపినావొ
ఉనుతరాజ్ఞానివై పడి • యుండినావొ
మఱపుమున్నిటియడుగున • మలఁగినావొ
ఇప్పుడైనను లెక్కించి • చెప్పఁగలవ ?
ఆలకించుచునుంటివా ! • ఆంధ్రపుత్ర ! —

౪

ఒడలు తెలియక నిద్రించు • చున్నయపుడు
ఏమియయ్యెనో నీజాతి • యెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీమత • మెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీవేష • మెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీభాష • యెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీరూప • మెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీశాల • మెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీగృహ • మెఱుఁగవుగద !
ఏమియయ్యెనో నీమాత • యెఱుఁగవుగద !
పాఱఁజూడుము లేచియీ • పాటికైనఁ
దోడిభారతులతో నీవు • కూడిమాడి
తల్లినర్చించి తత్ప్రసా • దంబుఁ గలిగి

అభ్యుదయపరంపరల నీ ♦ వందుకొనక
ఆలసింపగఁ బోకుమా ♦ వంతయైన
ఆలకించుచునుంటివా ? ♦ ఆంధ్రపుత్రి!—
ఏమహాజ్ఞానవశత నీ ♦ వెట్టులైతో
ఏమహాశాపవశత నీ ♦ వెట్టులైతో
ఏమహాపాపవశత నీ ♦ వెట్టులైతో
ఏమహాకర్మవశత నీ ♦ వెట్టులైతో
బుద్ధినించుకనూహింపఁ ♦ బూనితేని
పూర్వదృష్టినిగనితల ♦ పోసితేని
మానసానుతాపంబున ♦ మఱిగెదేని
పూర్వకృత్యమునెఱుంగఁగాఁ ♦ బూనెదేని
అఖిలమునెఱుంగఁగావచ్చు ♦ నంతలోనె
అఖిలయాతనలనుబోవు ♦ నంతలోనె
అఖిలపాపంబులునుబోవు ♦ నంతలోనె
అఖిలకర్మంబులునశించు ♦ నంతలోనె
అమరవాక్యంబులనువీని ♦ నాదరమున
నాలకించుచునుంటివా ! ♦ ఆంధ్రపుత్రి !—

౫

పావనోద్యానమునఁజేరి ♦ ప్రకృతిసూక్తి
చిన్నిశారిక చెప్పుచు ♦ నున్నయపుడు



చిగురుజొంపంబులోఁజేరి ♦ నిగమసూక్తి
చిన్నికోయిలచెప్పుచు ♦ నున్నయపుడు
పుష్పగుచ్ఛంబుపైఁజేరి ♦ పురుషసూక్తి
చిన్నితుమ్మెదచెప్పుచు ♦ నున్నయపుడు
ఫలగుచ్ఛంబుపైఁజేరి ♦ పరమసూక్తి
చిన్నిరాచిల్క చెప్పుచు ♦ నున్నయపుడు
మేలిపరిమళముల నను ♦ కూలసూక్తి
చిన్నివాయువుల్ చెప్పుచు ♦ నున్నయపుడు
ప్రేమబద్ధానురాగులై ♦ ప్రేమసూక్తి
వరరమామాధవులు తమ ♦ వాంఛదీర
నుత్సుకతఁ బ్రొద్దుపుచ్చుచు ♦ నున్నయపుడు
సకలసౌభాగ్యమగు శుభ ♦ సమయమపుడు
మేలిసమయమప్పుడు నీవు ♦ మేలుకాంచి
తనఘ! శుభపరంపరలు నీ ♦ కగునుగాక
అతిథిసత్కారమునుజేయు ♦ మదనెఱింగి
ఇదియె నీకున్నసౌభాగ్య ♦ మెల్లయెడల
నిదియె నీకున్నగౌరవ ♦ మెల్లయెడల
నిదియె నీకున్నప్రధన ♦ మెల్లయెడల
నిదియె కావించుసుమ్మినీ ♦ యిష్టసిద్ధి
ఆలకించుచునుంటివా ! ♦ ఆంధ్రపుత్రి!—

౬

పూర్వగౌరవమును బొందఁ • పూనికతోడఁ
పూర్వధర్మంబులొనరింప • పూనికతోడఁ
పూర్వవిద్యలఁ బొందెదు • పూనికతోడఁ
పూర్వభోగంబులను బొందు • పూనికతోడఁ
పూర్వపురుషుల మర్యాద • బుద్ధినెంచి
పూర్వపురుషుల చర్యల • బుద్ధినెంచి
నీదు వ్యక్తిధర్మంబు • నీవెఱింగి
నీదు సస్త్రీకధర్మంబు • నీవెఱింగి
నీదు జాత్యుక్తధర్మంబు • నీవెఱింగి
నీదు మానవధర్మంబు • నీవెఱింగి
కోవిదుండని యనిపించు • కొనెదవేని
గొప్పమతకర్తవనిపించు • కొనెదవేని
కులమహారత్నమనిపించు • కొనెదవేని
మనుజవర్యుండవనిపించు • కొనెదవేని
ఆత్మవేషంబు మార్పకు • మయ్య! యెపుడు
ఆలకించుచుంటివా! • ఆంధ్రపుత్ర!—

౭

మఱవఁగా రానిశత్రుల • మఱతుగాక
మఱవఁగా రాని మిత్రుల • మఱతుగాక



మఱవఁగా రానిబిడ్డల • మఱతుగాక
మఱవగా రాని ప్రియురాలి • మఱతుగాక
మాతృదేశంబు మఱవకు • మా! కుమార!
మాతృభాషను మరవకు • మా! కుమార!
మాతృభూమిని మఱవకు • మా! కుమార!
మాతృదేవత మఱవకు • మా! కుమార!

# అణాగ్రంథములు.

బాలునివీరత్వము.
ఇదయొక చిత్రము.
బ్యారిష్టరు.
జాతీయగీతము.
అనాథప్రేతము.
కాకము.
ప్రేమాంజలి.
మీరాబాయి.
రాణీతారాబాయి.
కాబూలుసాహేబు.

# అరణా గ్రంథములు.

గోదావరిపాట
అనుమానపురుషులు.
ఆలుమగలు.
సంవత్సరాది.
గర్దభస్తోత్రము.
చిత్రకథ!
కపోతము.
మంగళహారతులు.
రామకీర్తనలు.
చిలుక.
నవ్వులో — పువ్వులో.
చందమామ.
పరిణయకోపము.

# నాటకములు.

| | | | |
|---|---|---|---|
| సతీసంయుక్త. ... ... ... | 0 | 8 | 0 |
| యాచశూరేంద్రవిజయము. ... | 0 | 8 | 0 |
| చిత్రకథాసుధాలహరి. (పద్యములు.) | 0 | 6 | 0 |
| సురస. (నవల.) ... ... | 0 | 8 | 0 |
| స్త్రీలవ్రతకథలు. (మొదటిభాగము) ... | 0 | 6 | 0 |
| స్త్రీలవ్రతకథలు. (రెండవభాగము) ... | 0 | 6 | 0 |

బి. వి. రావు అండ్ బ్రదర్సు,
నిడదవోలు, కృష్ణాజిల్లా.

